# ఉమర్ ఖయాం

(స్వేచ్ఛానువాదం)

మాధవపెద్ది
బుచ్చిసుందరరామశాస్త్రి



నవ్యసాహిత్య పరిషత్తు
△ గుంటూరు △

## ఉమరు

తలఁతున్ నిన్ను భజింతు నీదు మధుపాత్రన్ సేసకోన్ మీఁదు ని
స్తులమైయున్న వసంతరాగమున సిందూరించుకొన్నట్టి మీ
లలితోద్యానము లోపలన్ నిలిచెదన్ లక్షింతు నే నిక్కపుం
దలపున్ మీవలపున్ మనమ్మున కసాధ్యంబన్న దేముండెడిన్

లలి నీవుం జెలియున్ వసించు పొదరిల్లా యిద్ది? యిద్దాని ముం
దలగా నుండిన యీ శిశుప్రకృతి చెన్నాళ్ళీలాసంఘ లె
లలఁ బాలించితిరో కదా! పూనలు లాలల్ వో యసంగాఁ బూల బా
లలకున్ జెల్లపయిన్ విహంగములు జోలల్ పాడ నాలించుచున్

ఎపుడచ్చోటను బూలతుప్పరలలాగే యున్న దే మేమి క
ప్రపుఁ గమ్మందనమబ్బ నిచ్చటను! గుజ్జుండన్నఁ గుజ్జుండుగాఁ
డు పువుందోఁటలు లిట్టి యీ చిలిపిగాడ్పుం గన్నదో గాని యె
ల్లపుడుం దీవలసందులన్ జొరుట లేనా? కన్నపుం దొంగగన్

అది, నీ పేర్కొనియున్నయట్టి సెలయేఱా ? నీవు చిత్రించుకొ
న్నది యందుండినయట్టి నీటిపరుగేనా ? యీ రెలుంగేని యె
ట్లొదిగెన్ నీ కవనమ్ములో నచట మున్నున్నట్టులే యుండియు
న్నది నేఁడున్ గవిహంసలన్ బరమహంసాకారి వీవన్నిటన్

* * *

## అంతశ్శ్రుతి

అవసానమ్మున హంసచేయు రుతితో హంసాభిధుండైన యా
రవి సాయమ్మున నస్తమించు రుచితో రక్తాశ్రువుల్ రాల్చుచున్
గవిహంసా ! యలనాఁడు దైవతముపైఁగాఁగన్ నిషాదత్వ మం
త విషాదాంత మొనర్తువే కవనగాంధర్వమ్ము నంతశ్శ్రుతిన్

వాకును వాకునుం జ్వలితవహ్ని విధానఁ గిరాతుఁగూర్చి వా
ల్మీకి ముఖమ్మునుండి వెడలెన్ మునుశ్లోకము కాని శోకమే
యాకృతినొంది నీయెడల నక్షరతన్ జతబాయు పక్షిగోం
తో కవి! నేఁడుగూడనుకువ్వాకువ్వుమంచు ధ్వనించునాహృదిన్

అజా! విలాపముల్ గడచునట్టిది నీదు విషాదమొక్కటే
నిజముగ నప్పుడప్పుడు జనించు వియోగముకన్న నెప్పుడో
స్వజనముఁ బాసిపోదుమనుసంగతియే సహియింపరానిదీ
ప్రజకది యెంతదుర్భరము పాపము నీయటువంటి వేత్తకున్

అవునా నెచ్చటినిన్నొ యిచ్చటికిఁ ద్రోయన్ న్యాయమా? సర్వమా
నవ సంఘమ్మును నీదుపక్షమునునుండన్ సిద్ధమిమ్మాటకిం
కెవరో వేఁడగ సాక్ష్యమీయవలెనె నీకిష్టమ్మొగా నట్టులన్
గెవ్వుమంచున్ బడి నేలపై నపుడటుల్ గీపెట్టుటే చాలదే

ఈ పడియున్న నిన్నిచట నేనియు నుండఁగనీక యెంతమా
పోషనివాఁడొ యింకనెటకో తరలింపఁగనున్న వాఁడెవం
డో పొడగాననాని యొకధూర్తుఁ డతండటె యీశ్వరుండుపో
మా పసిబిడ్డపై పరమదుర్గతి నేటికిఁ దద్విచారణల్

ఈ పువుఁదోట నివ్విధమున నెన్నఁటికేని నిరర్థకంపుదై
ర్పోపహతిన్ గుఱించి వగఁ బొందకు నీప్రియతోడుతన్ నినున్
లోపలఁ బెట్టుకోఁగలదు లోక తెలుంగఁగలారు వాసనా
రూపతనిన్ను నమ్ము మిదియూహఁగ నాయుమరూ! జగద్గురూ!

* * *

## ఉదయరాగము

సకియ మన భాగ్యరేఖలు స్వర్ణకాంతి
వెలుగుచున్నవి పూర్వాశ కెలనఁజూడు
మల్లదే శుభసూర్యోదయమ్ము లెమ్ము
తీయతీయని మధువు నందియరమ్ము

ఇలయొక పానశాలికగ నీ వినవచ్చెడి విశ్వగీతమే
పిలిచెడి పిల్పుగాఁగఁ దలఁపే తెఱువంబడినట్టి తల్పుగాఁ
జెలఁగఘటమ్ములందు మధుజీవనధారలు క్రోల్చుకొందమే
చెలియ ! యొకొళ్ళకొక్కరము చేతములన్న విశుద్ధపాత్రలఁ

చూచితె నీటిచుక్కలటు చుక్కలెటుల్ నిసిపాత్రనుండి చె
ల్లాచెదరయ్యెనో మణిశిలఁ విసరంగఁ బ్రభాతమల్లదే
చాచెను భాస్కరుండు కరజాలము జాలముపన్ను వేటకాఁ
డై చలచల్ల స్వర్ణశిఖరాళికినై సులతానుమేడపై

లోకములోనియీమృగయులున్ మృగయావ్యవహారమంచునా
వేకువవచ్చి రోజు వల వేయును దీయును సంజకెల్ల ని
ల్లే కొలఁదిన్ గొలంది హరియించును నాయువు నొక్కసారిగా
గాకను బ్రాణికోటి కెఱుకంబడ నీకను రాకపోకలన్

రమణిరో! చూడుమా యుదయరాగము నేత్రముకెట్లొ జ్ఞాననే
త్రమునకు నట్టులే హృదయరాగము సైతము రమ్యమైన వ
ర్ణములటఁ జేరినట్లై మధురమ్ములు ముగ్ధములైన ప్రేమభా
వము లిటఁ జేరుఁ గ్రోలుదము బాహిరమంతరమున్ సమమ్ముగన్

తరుణము మించిపోయిన వృధాయయిపోవు నిరీక్షయెల్ల నా
యరుణిమ యాతపంబయిన యట్టులె యీ యనురాగమేని దు
స్తరతరమైన సంసరణతాపముగాఁ బరిణామ మొందెడిన్
దొరుకదు ముందు జీవనమధుద్రవ మిట్టిది జన్మముండగన్

ఆకాశంబను పానశాల నుదయంబన్ పాత్రతో స్తోత్రమున్
రూకన్ గైకొని సూర్యుఁడిచ్చు రుచిరారుణ్యంపుద్రాక్షారసం
బాకంఠంబుగ నారగింప నిపుడెట్లాయత్తమౌచున్నదో
లోకస్థావరజంగమప్రకర మాలోకింపు మాత్మప్రియా!

తడవిటనుండఁబోము తఱిదప్పిన నిష్క్రమణమ్మె గాని యే
ర్పడదు పునఃప్రవేశమికఁ బాత్రల కింకెడిఁబోషణార్థముం
డెడి రసమింతలోఁ దెఱువుడీ వడి ద్వార మటంచునెట్లు సం
దడి యొనరింత్రొ జీవులు వినంబడుగా! మధుశాల మోసలన్

నవనవంబగు జీవనము ప్రసాదింప
విశ్వమంతయుఁ బల్లవించు వర్ణమున
జీవిజీవికిని ధారావాహికముగ
హృది రాగరస మావహిల్లు వర్ణమున
అనునిమేషమ్ము నీ యధరబింబమ్ము
పిలుచుచున్నటు వలపించు వర్ణమున
సలరు ద్రాక్షారసం బాపాత్రతోడఁ
బ్రేయసీ! తెచ్చి నాపెదవి కందిమ్ము
ఇఁక రాదుతిరిగి పోయిన నిమేషమ్ము
మనదియౌనో కాదొ మరునిమేషమ్ము
తత్క్షణమ్మె తెమ్ము ద్రాక్షారసమ్ము
నాస్వాదనానంద మనుభవింతమ్ము
నే వెన్నదియ గా నీళులన్ జిలికి
యొడి బిడ్డఁడుండగా నూళ్లెల్ల వెదకి

చెలి! యమూల్యంబైన జీవితంబందు
నకట! కాలం బెంతో హత మొనర్చితిని
చాలు నేపడినట్టి శ్రమము సర్వమ్ము
బూదిలోఁ బన్నీరు పోయుటైపోయె

సందెవెలుఁగులలోఁ బానశాలముందు
నిలిచి తనచేతిలోనున్న కలశినుండి
చుక్కరాల్చెను జక్కనిచుక్కయొకతె
దేహ మిదియుండిగూడ విదేహమయ్యె

చేతఁ గలశమధువు చెంతను బ్రియురాలి
యాత్మమధువు మాస మసలు మధువు
ఆరబండె నా మనోరథఫల మిట్లు
మధువెకాని ముక్తివధువె వలదు

కడురమ్యమ్ముగఁ బూచు నే తరుణ వృక్షచ్ఛాయనో కాలముం
గడుపన్ జెంతఁ బికస్వరమ్ము రసవంతమ్మౌ ప్రబంధమ్ము సా
పడ సుస్వాదుఫలమ్ములున్ మధురముల్ పక్వాన్నముల్ మోవిపై
నిడ ద్రాక్షామధుపాత్ర యున్న యెడ నిస్సీ! స్వర్గ మిం కేటికిన్?

అవిగో! రాలుచునున్న యాపువ్వులచాయఁ మృత్యునిశ్వాస వా
యువులఁ వ్రాలిరియెందరో మనసహాయుల్ నెయ్యులేకొంచె మా
యువోయీ దేహమునంటియుండగనె నోరూరించు ద్రాక్షాఫలా
సవ మాకంఠముగా ననుక్షణము నాస్వాదింత మాత్మప్రియా!

తలపై నొక్కొకపువ్వో రాలిపడుచుండఁ బైడిలేయెండ చు
క్కల నెమ్మేనులఁ గమ్మదెమ్మెరలమొల్కల్ నీటి పన్నీటిచు
క్కలఁ జిల్కఁ సరసీతటిఁ వకుళవృక్షచ్ఛాయలోఁ గెంపుఁ జా
యల ద్రాక్షారస మారగింతము వయస్యా! భుక్తశేషమ్ముగఁ

ఇం దీస్నేహాలతాకుడుంగమున నేనే నీవునై యుండి నీ
సౌందర్యమ్మును విప్పెదఁ నెమలిపింఛంబట్లు లోఁజూపులో
నందింతుఁ హృదయమ్ముకుఁ హృదయమత్యంతమ్మునర్తింతునా
నందాశ్రుల్ హావణిల్లి కన్గొనల నీ నా తృష్ణచల్లారగఁ.

ఈ వనలక్ష్మి వీవయిన నేను వసంతుఁడనైన నిత్యముఁ
పూవులబండుగై గడచిపోవును జీవితకాలమంతయుఁ
భావమె స్వర్గమై యమృతభాండమె నీవయియున్న నింక స్వే
చ్ఛావరమొందెదఁ నిజరసమ్ముగ గుత్తుకబంటి గ్రోలెదఁ

ఒకరూపమ్మె వహించు మేఘములమై ఓముత్యమా ! ఓయమా
యికమా! కొండలఁ దేలిపోవుదమ? కాదేని జంద్ర కాంతాలమై
యొకమారే వికసించి వెన్నెలకు లోలో ప్రేమమై పోదమా !
ఇకఁ గ్రొంగ్రొత్తగ నొక్కరింకొకరమై యే నీవు జన్మింతమా

జతగా నిర్వర మొక్కరూపమె వహించన్ నీకు నే వేళలో
హితమైయుండక పోయినట్లయినఁ బోనీ నీవు పుష్పించు మా
లతివైనన్ బ్రకృతిప్రతిన్ బ్రణయలీలాగీతికల్ వాడి నీ
ప్రతిపుష్పమ్ము మరందబిందువుల నాస్వాదింతు భృంగంబనై

అదియున్ నీకు ననిష్టమైనయెడ సంధ్యాస్వర్ణవర్ణముచేఁ
బొదువంగాబడినట్టి చంద్రకళవై పోష్ఠావు దివ్యోదక
హ్రదమైపోదును నేను నాయుదకమధ్యంబందు బింబించి నేఁ
గదలన్ గాలికి నీవుసుం గదలి యూఁగన్ వచ్చు నాలోపలన్

కలిగెన్ వింతవెలుంగు జీవికకదో కాసెన్ మనోవీధి వె
న్నెలలన్ నవ్వుచునుండునీకనులు వన్నెల్ వన్నెలన్ జిన్నెచి
న్నెల రాచిల్కగ గూడుగట్టుకొని లోనే కాపురంబుండె నీ
వలపో ముద్దులసీమ ! రమ్ము నడిపింపన్ నన్నుఁ బూబాటలన్

లువన్ నీడ లిఁకేల వేఱెచెప్పుమా నీవేనునుం దోడు నీ
లమైయుండగ నంత కావలసియుండన్ బల్కు ముత్యాలమే
లు లేవోయిఁక వానిలో వలపుజాడన్ దోచవో రంగురం
లనీడల్ శతముల్ సహస్రములునుంగ్రొంగ్రొత్తరూపమ్ములన్

లకుం బ్రాణమువచ్చునట్లు మది తెక్కలన్ దెచ్చుకొన్నట్లు మ
బ్బలతో మంతనముండియుండి మనచూపుల్ చుక్కలంగప్పి పు
ప్వలజల్లుల్ దవుదవ్వులం బొలయఁగాఁ బోరానియేయంచు లం
లలోనో విహరించుచుంటిమనిపించున్ గోర్కెలూరించుచున్

లసెన్ బ్రాణము విశ్రమింతమిఁక నాత్మారామమందున్న స్నే
ాలతామంటప మధ్యభాగ సుఖశయ్యన్ మేనులన్ వ్రాల్చి చా
లదైనందిన కేళికామృత సరోహంసధ్వనుల్ వించు నూ
వ్వల లోలో మన మొండొరున్ వలపుఁదీరున్ దియ్యము న్ని
ల్చు చుక్

* * *

# మ ధు వు

తీయనిద్రాక్షపండులను దీయురసమ్ము ద్రాగఁ ద్రాగుబో
తాయెను జవహింసమెయి నామిషభక్షణఁజేయ లోటురా
దాయెను మానవత్వమున కచ్చము నెత్తురుకూడె మైన రా
జాయె నిఁకెంతగాఁ బతితమానో వివేచనరీతి జాతికిన్

దోనపయిఁ జేలిపోవు పువ్వుదోనెను నట్టింటఁజేయుకొంటి గా
లిని బలెవచ్చితాకుసుఁ జెలీ! మధుపానవుఁ బాపభీతి బో
దునె యనుకొమ్ము పేరు యధోగతికట్టి రసామృతమ్మునే
ధనమున కమ్మికొందురుగదా! యొక కొందరికేమికొందురో

మోవిని పానపాత్రనటు మోపఁగఁబోయెడి నోళులెన్ని యో
యావిధిచేత మూయఁబడినప్పటికిన్ జెలి. చూడు మావులన్
గ్రోవుల మాటిమాటికిని కోయిల కూయుచుఁజొచ్చు నేటికిన్
ద్రావుడి! త్రావుడీ! మధువు త్రావుడి! యంచు గులాబిరాగిలన్

జడుపన్ పిన్ జలిచే వడంకుచును బశ్చాత్తాపమున్ ప్రాత వ
చ్ఛదమున్ గప్పితి వింకనేల ప్రభవించన్ నీటిలో నిప్పుకై
వడి హేమంతమునన్ వసంతమదిగో! జ్వాలాముఖంబందునం
బడి దగ్ధంబయిపోవుగాత యిటురమ్మా పాత్ర నిండింపుమా

దవ్వుగ లేదు గమ్యమును తావక మైన వయోవిహంగమో
ఆవ్వనఁ బాఱునట్టి దదెతెక్కలసవ్వడియున్ వినంబడున్
ద్రవ్వకు మూరకే తరతరంబుల గాథల నింతలోపలన్
గవ్వక పోవునే మొగద కాలమె సాళువడేగలాగునన్

కథయే మాసినవారిగూర్చి వృథగా గాసిల్లఁగాఁబోకు మీ
క్షుధతో క్షోభిలునట్టివారి నటులే క్షోభించనీ యొక్కటే
క్షుధతో మండెడివారి మండిపడనీ గోడేదియున్ లేక యీ
సుధతో నుందము హాయిమై మఱపుగొంచున్ సర్వవేధల్ వ్యథల్

వాద వివాదశీలురగు వారలలోపల వారినే తలల్
మోదుకొనంగనిమ్ము గతమున్ గుఱియించిన చింతదీసి నా
మీఁదను బాఱవేయుము ప్రమేయము వేఱొకడంచు లేని ని
ష్ఖేద సుఖానుభూతికి సఖీ! గ్రహియింపుము పానపాత్రికన్

ఆసుమపేశలంబయిన హస్తముతోడుత నిట్లువచ్చి ద్రా
క్షాసవమిచ్చు నీయలతి యందెలనాత్ర నడంగిపోయెలే!
నాసఖి! చిన్ని దివ్వెకతనన్ జెనుచీకటిపోలె నీశ్రవో
వాస మొనర్చుకొన్న యలవాద వివాదపు ఘర్ఘరధ్వనుల్

కోమలి! స్వర్గమున్నదనుకొన్నను నయ్యెడఁ బీటఁబెట్టినన్
భూమిని లేని సౌఖ్యములు బొందియటన్నది లేకయుండఁగా
నీమటుకీవు నామటుకు నేనును బొందెడిదేమి? యిట్టివే
లే! మొదలే పురంబనుచు లేకయె యంతిపురంపు ముచ్చటల్

నీదరి తీయతీయనగు నీరములుండఁగ దాహమార్చుకో
సూదిని బావి దవ్వుకొనఁ జూచెదవా? యిటు లోకమంతయున్
నీదయియుండఁ బోవిడిచి నింగికిఁ జేతుల నెత్తఁబోదువా?
చేదుకొనంగఁ బైనెవరొ సిద్ధముగాగను నున్నయట్టులన్

నీకయి యేమిసాయపడు నింగియె బోరగిలంగఁబడ్డ పె
న్మూకుడులాగునన్ గతియు మోక్షములే కటులుండియున్నదే
సాకి! నిజానకింక మనసంగతియన్నను దానిక్రిందుగాఁ
బ్రాకెడిక్షుద్ర కీటకపు బాటివి యీమదిఁ బాఱజూచినన్

ఊసరమందు రాలిపడుచుండు తుషారమునిల్చు నెంత సే
పేసఖి! కంటినెంత మెఱపించిన నెంతగ సూర్యరశ్మిచే
నూసరవెల్లి మారుపులనొందిన నస్థిరభోగపాళి యం
తే సుమి! మానవాళికి లభించిన నిందు లభింపకుండినన్

నేటికె యుండజూచుకొననేరని యట్టి యభాగ్యులన్ మఱే
నాటికొ దాచియుంచు పిసినారుల బట్టుక కాలమొక్కఁడే
గాటికిఁద్రోలుచున్ బకపకన్ నగుచున్నది చూడు కూలికిన్
గూటికిఁ జెడ్డవారలిరుగో! యనుచున్ జెయివెట్టిచూపుచున్

మూటలుగట్టి బంగరువు మొక్కులువెట్టి నతండు నీళ్లఁ చె
ర్లాటమొనర్చు నాతఁడును రాశికిఁజేరెడునట్టి దొక్కఁడే
చోటికిఁ నెంత త్రవ్వి పరిశోధనఁజేసినఁ దత్సమాధులన్
రాటిపసిండి నొక్కనలినాథము చిక్కడు నేటిభుక్తికిన్

విన్నగతించెనే యనుచు నెవ్వగఁబొందుట యెంతొ రేపు రా
మన్న దియంచు సంతసముఁ గొందుట యంతియ యుస్సురస్సు నీ
పున్నెము నిన్నలో గలసిపోవును నేఁడునుగూడ నెచ్చెలీ!
పన్నలుగావె? యీళనులు చూచుచునుండగ నెన్నొ నిన్నలై

ప్రియజనమ్మెట్లిన్ విడిచిపెట్టెనో యీ మనకాన్తృబ్రాన్తి యా
శ్రియమయి చూచిన యెడల వసంతవనీహృదయాగర తంతం
బయినదొ శయ్యగూర్చు కుసుమాస్తరణాగ్ని లమున్ విమోహ ఘూ
శయనమునొంది యుండెనవి యుద్యాన వనాంతము మెల్లి నెచ్చెలీ!

పోకలు పూచుచున్నపుడె పోకలఁ బుట్టలపాకు తీగియల్
ప్రాకుచుఁ బ్రాకుచున్నపుడె పైపయి వచ్చి లవంగవాయువుల్
సోకుచు సోకుచున్నపుడె సుందరి! యీ లవలీనికుంజమం
దేకతముండి నేడు సుఖియింపము రేపటిమాట కేమిలే

పూచుగుబాబి యిట్టులనె పూచుచునుండదు సర్వకాలమున్
నాచెలి! నేడు దాచినధనం బటునిచ్చెను మాదుమెట్టులన్
వేచెడినో వసంతవనవీథులు నోచిననోము పంటలై
యూచెడిరాగ మూర్ఛనల నుండుద మెందొకయందునిందులన్

అడవులఁ జేరబోను యతినై పురసీమల భోగలాలసన్
గడుపను గాలమిల్లవును గాదను నీ పొదరింట నేరికే
నొడయుఁడగాక వేఱొకరి యూడిగముం బొనరింపకుండు నె
య్యెడలను గామగంధ మొకయించుక లేని ప్రియస్వరూపినై

ఎలదోటంబలె నవ్వుచున్ బ్రదుకుమీ! యెల్లప్పు డానందమున్
సెలయేటై ప్రవహింపుమీ మృతికిఁబై నీవేమియాదంచు లో
దలఁతో యయ్యదియిప్పుడేయయితివన్ తత్త్వమ్ము గైకొమ్మి యా
యిల నీకప్పుడు హాయి నీగలదు సుమ్మా! తూగుటుయ్యేలయై

మున్నొకకాలమం దెవనిముద్దియయై యెటులన్ విలాస సౌ
ఖ్యోన్నతి నోలలార్చినదొ యోచెలి! యీ మధుపాత్ర నేఁడు నీ
యున్నత హస్తలాలనము లందుచున్నది చూడు మన్ననన్
మన్నయి పోవుచుండినను మాయవొకో మన జన్మవాసనల్

ప్రియుఁడందీయఁగ బిన్ననవ్వున గులాబీనీడలో నిప్పుడే
క్రియ నీవీ మధుపాత్ర యాపెదవులన్ గీలించుచున్నావొ య
ట్లె యిఁకన్ ముందు నొకానొకప్పుడును గీలింపన్ వలెంజుమ్ము ని
ర్దయతన్ మృత్యువొసంగనున్న విషపాత్రన్ సైత మేనింజెలీ

* * *

## పూఁదోఁట

నుదుటను ఘర్మబిందువులు నూతనమైన సువర్ణపట్టికం
బొదిగిన యాణిముత్తెముల పోల్కిని ముద్దులు మూటగట్టఁ బ
య్యెదసవరించుచున్ బొడుపు టెండను ఱెప్పలనార్చుకొంచుబూ
బొదలకు నీవు నీరములువోయుట లందములొల్కఁ బోయుటల్

ఎడపక దోహదక్రియల నీ వొనరించెడుపట్ల మేనిపైఁ
బొడమెడునట్టి లేఁజెమరు మొగ్గలఁ జూచియుఁ జూచి తానునుం
దొడిగెను బూలమొగ్గలను దొయ్యలి! యవ్వనలక్ష్మి చూడు మె
వ్వడువున వైచుచున్నవియొ వాయువులుం బిలపిల్లమొగ్గలన్

ఏలకి ముద్దుగొల్ప నొకతే మెయిముద్దును ముద్దుఁజూపఁగా
మాలతి ముద్దురాలవలె మాటికిఁ బాలగులాబిముద్దులన్
జాలఁగఁ జాలఁగాఁగురియఁ జానరొ! ముద్దులుమూటగట్టు నీ
పూలవనమ్ముకే వలపుపో! యిటులీవు మొగమ్ము వెట్టినన్

ప్రాచినపోక కల్లుకొనిపోయిన తమ్ములపాకు చారలం
జూచుచు నీదుకంఠమునఁ జొక్కుదునా మధువానినట్లె నే
) చలువల్ దొలంకు సెలయేటిదరిన్ దృణవేదినుండి నీ
కే చవిచూచుచుండెదవ ? యీ రసపాత్రిక డించకుండఁగన్

మీ క్ష

ల్లీ! యిప్పుడెవత్తు మమ్మతిరుగన్ మందారమా! అక్కలున్
ల్లెం డ్రే మనుకొందురమ్మ యొకఝుండే నిల్చుచో మాలతీ !
ఝ్యం గొంచెముచేసితమ్మ యిటులీ పూరింపఁగా సాగినన్
ల్లేసాగవు గాలి నీవయిననేగా! అమ్మ పన్నీరమా !

సవన్ జల్లఁగ బొఱునట్టి సెలయేటె నిల్వొటద్దమ్ముగా
గడా ! నీడలు చూచుకొనె సరిపోవున్ బ్రొద్దుపొద్దెల్ల నీ
మమ్మెక్కడఁ జూడఁదీరుబడియా నెంతెంతగా వేడ వే
గనో రాల్తు వొకొక్కపువ్వయిన వాడన్ వాడ వాసించులే!

ఈనాటి కబ్బెనటే? నాడు సంపంగి
బంగారమా! నీకుఁ బరిమళంబు
ఎచటఁ జూచినను నీవేనటే? పున్నాగ!
పట్టి సంతానగోపాలమట్లు
ఎవరు ముట్టిరె? లవలీ! నేఁటికే యట్లు
వెలిసెదు వెన్నెలపోఁకజ్జు
పసితనంపుం బ్రొద్దుపుసలినన్ నిలింక
సందాల పాపకేనా లవంగి?

మాధవీ! నీసుతావి సూక్తిమున మోక్ష
మమ్మ, సురపొన్న ఏపెడ నా[illegible]ంచి
భుక్తశేషమ్ము లందిచ్చి పుచ్చుకొనుచు
నారగింతుము తెమ్ము ప్రసారసమ్ము

ముట్టగారాము లేమత్త మొగలి నిన్ను
బాకులుంగూడనా రేపరేప సందు?
కోరసికొనిపోద యొడలేగెగో భుజంగ!
అవునవని హాయి వానికే యువగతమ్ము

పుట్టి పవడమ్ములను రాశిపోసినటులఁ
జిగిరిచితి వెంతచక్కఁ జక్కఁగనొ మావి!
యేమిభంగిమ మయ్యది యెంతచూడ
నంత ముచ్చటగొల్పు వాసంతిమాకు

ఓ కన్నెపువ్వ! నీకా
యాకుమఱుఁగె రాణివాసమా? నిల్వుమ నీ
తాకోకచిలుక! మేమును
నీకరణి పునర్భవింప నేరమె చెపుమా

జవ్వనపుఁ గోర్కెఁలంబలె
నవ్వన్నెల పులుఁగులలయ కటునిటు నెగురన్
నివ్వటిలె చూడు మిప్పువు
లెవ్వారి యందంబు వారిదేయని తెలుపన్

ఎచ్చ మెచ్చటి పూఁదావి నచ్చటచట
కవ్వకొనిపోయి యెక్కడెక్కడనొ పెట్టి
తిరిగి వచ్చితివా? గాలిదిమ్మరీఁక!
తొంగి చూచుచునున్నావ? దొంగజాడ

అడుగవలవేయు నాతఁడేమైన నింక
నెట్టు పర్వతరాజును జుట్టుకొనెదో
ఓ నదీసుందరీ! వించె దొక్కమెయిని
మాకు సంగీతమో జగన్మాత పిలుపో

ఎదుటన్ నవ్వుచు నాట్యమాడు సెలయేటే కాదు సుమ్మెట్టులిం
పొదవంజేసెడి నీగులాబులు చెలీ! యొయ్యొయ్యనన్ విచ్చుచున్
నిదురన్ మేల్కొని తెక్కలార్చు పసివానింబోలి యర్వాంకలం
దుదయంబింత మహోదయంబగునె నేత్రోత్సాహమిట్లిబ్బునే

దిన మపరంజితేకులనుదిన్న నవాబులుగూడ మంటిలో
మనుగను మారిపోవగను మంటినెదించు గులాబులెట్టులన్
గనకము గ్రుమ్మరించెడినొ కన్గొనుచుంటివె? యిట్టె తెల్లవా
టిన దనుచుండగానె తమతెక్కలతోఁ బువుదోట నంతటన్

నవ్వుచునుండు పువ్వులను నవ్వుచునే పుటుకుంబుటుక్కునం
ద్రెవ్వఁగఁ జేయునాతనికిఁ దీగెలుపెట్టెడి ఘోషయున్ బువుల్
కెవ్వన వేయు కేకలును గేవలముఁ వినరానెరావుగా!
జవ్వని! యెంతహీనమగు జన్మమొకో నరజన్మమన్నచో

నరుఁడయి పుట్టి కష్టసహనమ్మున నాఁటియుఁ దేఁబు పిమ్మటన్
దిరిగి పశుత్వమొంది తనదేహముపై నభిమాన మూడ్వ కే
దొరకిన దానితోనె పరితుష్టివహించెడి పక్షిజన్మముం
దొరుకదె కోపమేటికొ తనుం బశువంచును బక్షియంచనన్

తరువై పే  ను బూండ్లుగాఁగఁ బరమధ్యానంబునందుండి స్థా
వరమై పక్షికులమ్ముకున్ బసులునిల్వన్ నీడగల్పించుచున్
నరకంజొచ్చెడి వానికేని ఫలదానంబూను పుణ్యమ్మునన్
జరితార్థుండగు నాటికా? యిటులఁ బుష్పంబంచు జన్మించుటల్

ఇక్కడి యీ లతానిచయ మెంతటి త్యాగమొనర్చుచున్నదో
యొక్కొకపుష్పమే వికసనోన్ముఖ మౌటకుఁ జూచుచుంటివే
అక్కడి యా మహీజకుసుమావళియున్ ఫలసృష్టిఁజేయఁగా
నొక్కొకఁడెట్లు రాలిపడుచున్నదొ యాత్మబలిం బొనర్చుచున్

భోగవిషమ్మెటుల్ విఱిగిపోవుచు త్యాగమటన్న పేరుతో
నాగమణిన్ సృజించి కరుణన్ బరమేశ్వరుఁ డీయుచున్న నే
లాగునఁ గన్య యౌవనవిలాసము గోల్పడు బిడ్డకై మఱే
లాగునఁ దల్లి బిడ్డయెడలన్ దనప్రాణము దీసియిచ్చెడిన్

పుట్టినవి పుట్టినట్టులుండి పూవులంత
యందగింపంగ నందు శీతాంశ మేనిఁ
బడయఁగల్గితిమే సత్యభామచీర
లేదువారాల నగలెన్నో యెన్నోయుండి

పూవుమాటె కాదు గోవేని నగ్నమై
సేవఁగొనదె మాతృదేవి గాగ
నంతయేల చూడు మా శిశువేనియు
ముద్దురాడొ దిస్సమొలనెయుండి

ఇంత చలువనిచ్చునే యింద్రనీలంపు
మణివిధాన వానిమంటి యొడలె
వెలఁది యట్టియాత్మ విలసనంబొకనాట
మనకుఁ గూడనుండి జణిగిపోయె

నాఁడు శరీరమెంత మలినంబయి యుండెనో యంతదుమ్ము కొ
ట్లాడుచునుండె నేఁడు మనయాత్మ చెలీ! విపరీత మేమనన్
జూడుము సత్యమున్ శివము సుందరమా నొక స్వర్గవీధినా
వీడుదయించుటల్ పెరిగి పెద్దగుటల్ నరకంపుఁగొంపినా ?

## చదువు

ఆది నొకసత్యమేగాని యన్యమున్న
యంశమెఱుఁగని నరుని దేవాంశభవుని
సత్యమే పల్కుమనుచు నసత్యమతని
యూహకుందెచ్చితివి గావ ? యోసి చదువ !

ఇది సత్యంబిది ధర్మమన్ గమనమేనీ లోన లేకుండనే
తదనుష్ఠానమొనర్చు నిష్ఠనటు లస్తవ్యస్తముంజేసి యో
చదువా! వేరొకడేదొమాయయనుచున్ సైతానటంచున్ మదిన్
మదినేయుండఁగనీవ? యీచదువికైనన్ మానవా? మానవా!

* * *

## గురువు

పసియాతండని వానినంత నిరసింపంజూతు వయ్యీశ్వరుం
బసిబట్టన్ బరమోపయోగియను పూర్వజ్ఞానమే లేక యా
నిసువేడన్ మనమెడ నాతని మనోనేత్రమ్మునన్ సర్వమి
వ్వసుధామండలమొక్క యీశ్వరకుటుంబంబల్లైతోచున్ గురూ!

తగదోయీ! విరమింపు మీచదువుచేతన్ వీని నీయంతవా
నిగ దిద్దంబని లేదు నేర్పుగలదేసీ నీవె యివ్వానియం
తగమారన్ గృషిసల్పు మంతటను గన్పట్టున్ భవద్జ్ఞాన మె
వ్వగ సూర్త్స్నమ్ముకె పో కధోముఖముగాఁ బర్యాప్తమైపోయెనో

* * *

## విధి

విరతియె లేకయుండ విధివ్రేలు లిఖించుచు ముందుముందుకున్
జరుగుచుఁ బోవుచున్నయది చానరా! యీజపముల్ తపమ్ముల
క్షరమును సైతమున్ జెఱుపఁజాలవు నీకనుదోయి బాష్పముల్
వరదలు వాఱియున్ నిలిపివైవగలే వొకమాట నేనియున్

ఎందోయుండిన నన్ను నెందుకొఇక్కైయిందున్బడంద్రోయుటో
యిందైనంబడియుండ నీకెటకొ నన్నేలాపడన్ లాగుటో
ముందీ దైవకృతాపరాధ మఖిలమ్మున్ విస్మరింపంగ నా
కందిమ్మా మధుపాత్ర యీపెదవి కాయందమ్ముతోఁ బాటుగన్

అచ్చెరవంటికన్నె యిఁక నా సుకుమారపుహస్తమందునో
నిచ్చలుచూచినన్ మధువునింపిన గిన్నె రసస్వరూపమో
అచ్ఛము కెంపువన్నె యిహమందున నింతకు మించియున్నె యే
మిచ్చుట కింతకన్న నిఁక నెక్కడికో పడనీడ్చెదో విధీ

జడములఁ జేసి వైచినను సంతసమేయగుగాని వ్యక్తులన్
జడుల నొనర్చుచున్ దనదుసంగతి సంగతిగాఁగఁ జూచుకో
నెడద సహింపనోప మతఁ డీశ్వరుఁడే యగుగాక యాటకాఁ
డిడ పెడఁగొట్టు బంతులమె యీవును నేనును వానిచేతకున్

* * *

## వేదన

ఏ సుఖభోగి మట్టి నుదయించెనో ముట్టినమాత్ర నెట్లు క
న్సాసెనో చూడు మెంత సుకుమారియొ యీలవలీకుమారి యే
రాసుత సొంపు కెంపు టధరమ్మున జన్మముగాంచు భాగ్యముం
జేసెనో యాగులాబి దరిసింప మనమ్ము దవించిపోయెడిన్

హాయిఁగఁబండి యేటి యధరాంచలమందున నిప్పుడిప్డె క
న్మాయుచునున్న దీ లవలి ముద్దుల యీ లతకూన నేక్రియం
జేయుదు శయ్యగా నిటులె జీవుల కష్టసుఖమ్ము లెన్న కే
స్వీయ వినోదమార్గమున స్వేచ్ఛగ గ్రీడయొనర్చు దైవమున్

## కాలము

నవయుచునుండ నొక్క పువు నవ్వుచునుండె మఱొక్క పువ్వు కా
లవశతఁజేసి చూడు మబలా! యిచటన్ మకువంపు మొల్క సం
భవమయినట్లె వేఱొకట మన్మథ మొల్కయు రాలిపోవు నీ
భువి పరికింప నెంతమది పొంగునొ యంతకునంత క్రుంగెడిన్

అపు డేరాజున కైన మిక్కిలియు మీదౌనట్టి జన్మోదు నం
తిపురం బేదుల కాపురంబిపుడు చేతిన్ నోటికందిచ్చి క్రో
లుపులిన్ సైతముఁగూల్చు వీరబలుఁజీల్చున్ బక్షి గృధ్రమ్ము నీ
వె పరీక్షింపుము కాలమో యిది చెలీ! వేధింపఁగా గాలమో

ండి కవీశ్వరుండు మును తాను వసించినచోట నెట్టులన్
ండెనో బ్రహ్మదండి గమనించితివే? యొకనాట నెచ్చటన్
వెండియుఁ బెడి మూలుగులు వెట్టెనో యచ్చటనే యిఁకేమనన్
గొండలు గుడ్లు వెట్టినవి తొయ్యలి! కాల మహాత్మ్యమింతయున్

* *

## పర్యవేక్షణము

తెలవ! యొకింత యెండ తెరదీయఁగఁ గన్నులముందు లోకమి
త్తెఱఁగె మెఱింకలోని తెరదీసిన నెంతటి సుందరాతిసుం
దరమగు లోకమో తలుపుద్వారము గూడను బైగ లోపలన్
దెఱచెడి నాథుఁడా మనకుఁ దీయఁగ సాధనమా? తలంపుమా

ఇహమున కొక్కమైని ప్రవహించును జీవనధార బుద్ధియన్
గుహ వెలునడ్డ నీరమటు కోమలి! యెన్నిదినాలు చుట్టినన్
బ్రహరినె చెట్టుద్రొక్కినటు పాయదు తద్గహనమ్ము కప్రమ
ట్లహరహమున్ హరించుకొని యారుదుఁబోదు నెడారిగాలినై

లోకంబంచోకఁడున్న మీఁదగద వెల్గున్ నీడయున్ దేహమే
నీవున్ లేనపుడింక దేవుఁడనుచున్ నీవంచు నెట్లుండునో

నాకీ మూలమెఱుంగరాదు సుమి! యెన్నాళ్ళేగురుం గొల్చినన్
సాకీ! యీముడి విప్పగాఁబడదు జన్మంబెల్ల యత్నించినన్

లోకము సృష్టికాఁబడుటలోఁగల యట్టి రహస్యమెద్దియో
నా కవగాహమానెడక్షణంబున మాఱిచి నైచి యింత చీ
కాకొనరించు దీని వికృతాకృతి స్వాప్నికమైన యొక్కర
మ్యాకృతి దిద్దితీర్చనె నిరాకులనిత్యసుఖాలయమ్ముగన్

* * *

## మధుఘటము

ఓసి ఘటమ్మ! యేమొ యనుచున్నటులుంటివి నిక్కమే నినుం
జేసినవారు విక్రయముఁ జేసినవా రిపుడేమియైరొ యా
యూసె వినంగరాదిటుల నూహయొనర్తును లెమ్ము నీదు సా
వాసమె కారణంబగుచు వారును నీవలెనుందు రెందునో

ఈ నవఖండమండల మహీతలమేలిన చక్రవర్తి నె
మ్మేనొ మఱేమొ మట్టెడటు మృణ్మయపాత్రలోనర్ప మట్టిపా
లేనికిఁ దప్పు కుమ్మరి సరే! యొక కొంతనయమ్మె ధూళిగన్;
మ్లానత నొందుకన్న నెదొ మానవహస్త మలంకరించుటన్

మట్టిగనున్న నొక్క సుకుమారపుమొక్క యెదేని దానిలోఁ
బుట్టి మనోహరంబయిన పుష్పము పూచునొ యేమొ మట్టనే
మట్టితి చేయుపట్టునఁ బ్రమాదపడం జనదోరి కుమ్మరీ!
పట్టికపోవ రూరకయుఁ బాత్రిక చక్కఁగ లేకయుండినన్

* *

## పరిసమాప్తి

చూచితెనెచ్చెలీ! చివురు జొంపపుసోరణ గింష్లనుండి నో
బూచుచు నెట్టులాడెడినొ పున్నమచందురు డింకమీఁదఁ దా
నీ చనవూని రాకలిటులెన్ని యొనర్చునొ యెంత నిల్వు నీ
కై చనునో వృధా! మనల నారయలే కొకనాటి కిచ్చటన్

అమృతప్రాయముప్రాయమేగినది యీయారామమందున్ వసం
తము చండంబున రాలినారిచటఁ బత్రమ్ముల్ వలెన్ బ్రాణమి
త్రములున్ జీవిక వట్టిపోయినది పాత్రంబోలి యీశూన్య లో
కమునన్ రోజుల రాకపోక లొకలాగైపోయె నీనాటికిన్

చెలి! దూరంబయిపోయె నీ చరణమంజీరస్వనంబల్ల బు
ల్బులు పాటంబలె నాశరీరమిఁక దొప్లున్ బాత్రచందాన నీ
యిలసైనన్ రసహీనమాచు నరుగో! యెవ్వారొ రానున్నవా
రలు కాబోలును గోచరించెదరు తారల్వోలె కంజీకటన్